# సారస్వతీం భావయే

రచయితా

అష్టకాల నరసింహ రామశర్మా

అష్టావధానీ

ద్రవ్యదాతా

రా॥ శ్రీ తొడుపునూరి శంకరయ్యా గుప్తా

చేగుంట – మెదక్ జిల్లా


ప్రచురణ

శ్రీ సరస్వతీ క్షేత్రము

అనంతసాగర్ – మెదక్ జిల్లా – 502 267.

ప్రచురణ : భావ మహా శివరాత్రి
ప్రతులు : వేయి

వెల : రు.25/-



ప్రతులకు :
రచయిత్రి
శ్రీ సరస్వతీ క్షేత్రము
P.O. అనంత సాగర్
సిద్దిపేట డివిజన్
మెదక్ జిల్లా
పిన్ : 502 267.

ఓం

## శ్రీ సరస్వత్యై నమః

పరబ్రహ్మముతో, మిధునీభూతయైన వాక్కు తొలుత అవ్యక్త నాదముగా పరమాకాశమున నుండి, "ఓం" రూపముగా ధ్వనించి అకార, ఉకార సమ్మేళన రూపమగు ఓంకారమును పలికినది. అదియే ప్రణవముగా కీర్తించబడినది. అది తత్పురుష స్థానీయమై భూః, భువః, సువః అను వ్యాహృతులుగా వెలువడి పంచభూతములుగా నేర్పడి సమస్త స్థావర జంగమములుగా విభజింపబడినది. వాని సమ్మిశ్రణమే భువన సృష్టి కాలవాలమైనది. దానితో జగద్వ్యాపారము పరబ్రహ్మమునకు అవసరమై వాక్కు యొక్క ప్రత్యక్షోపయోగము ముఖ్యావశ్యకమైనది. దానితో సమస్త జీవజాలము తత్తదుచిత జన్మములకు ఆకరమై ఉత్తమ మధ్యమాధమ వ్యక్తిత్వ విభజనమునకై గుణసృష్టి జరిగినది. దాని కారణమున దైవాసుర మానవులు బుద్ధిజీవులుగా మిగతా ప్రాణికోటి తత్తదనుసరణీయములుగా జీవించుచున్నవి. వారి వారి బుద్ధి వివేకమును బట్టి దేవతా వర్గీకరణ జరిగి మత భేదములతో పరబ్రహ్మముతో గూడిన వాక్కు సగుణ నిర్గుణ రూపములుగా ఉపాసించబడుచున్నది. సగుణ రూపిణియగు సరస్వతి విద్యా బుద్ధి జ్ఞాన స్వరూపిణిగా నున్నది. వేదములలో ఆమె నదీ రూపముగా ప్రస్తుతించబడినది కూడా.

అంబితమే నదీతమే దేవీతమే సరస్వతి ।

అప్రశస్తా ఇవశ్మసి ప్రశస్తిమంబ నస్కృధి ॥ (ఋగ్వేదము)

దేవీ భాగవతాదులలో సరస్వతి విష్ణు పత్నిగాను, బ్రహ్మపత్నిగాను, బ్రహ్మకు కూతురుగాను శాక్త సరస్వతీ తంత్రమునందు సకల దేవతలకు మూలాధిష్ఠానముగా వర్ణించబడినది.

దేవీ సచిత్తః పుం రూపాం స్త్రీ రూపాం వాపి చింతయే.

అధవా నిష్కలంకాద్య సచ్చిదానంద విగ్రహమ్ ।

అను ధ్యాన శ్లోకము ప్రకారము సరస్వతీ దేవి స్త్రీ పుం రూపములుగ నున్నదన్నపుడు పురాణాదులేమి చెప్పినను వేదము మాత్రమే ప్రమాణముగా నంగీకరింపదగుట చేతను పరబ్రహ్మముతో మిధునీ భూతయైన వాక్కు సమస్త చేతనాచేతన రూపమును పొందినదనుట నిస్సంశయముగా నంగీకరించవలసి యున్నది.

ఉపాసకుడు తానూహించిన మార్గముననే పరబ్రహ్మము పూజ లందుకొను కారణమున ఎవరేయే మార్గము లెంచుకొందురో తన్మార్గముననే తరించుట కలదు.

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ", "ఆపోవా ఇ దగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః ప్రాణావా ఆపః। పశవ ఆపోఽన్న మాపోఽ మృత మాపః। సమ్రాడాపో విరాడాప శ్ఛందాగ్ం స్యాపో జ్యోతీగ్ం ష్యాపో యజూగ్ం ష్యాపస్సత్య మాపం। సర్వాదేవతా ఆపో భూర్భువస్సువరోం॥"

"అగ్నిర్మేవాచి శ్రితః। వాగ్ఘృదయే। హృదయంమయి। అహ మమృతే। అమృతం బ్రహ్మణి ..... పునర్మ ఆత్మా పునరాయురాగాత్। పునః ప్రాణః పునరాకూతమాగాత్ వైశ్వానరో రశ్మిభిర్వావృధానః। అంతస్తిష్ఠత్వ మమృతస్య గోపాః।

తస్యాం సముద్రా అధి విక్షరంతి తేన జీవంతి ప్రదిశశ్చతస్రం।

తతః క్షర త్యక్షరం తద్విశ్వముపజీవతి।

ఇత్యాది మంత్రములు వాక్కు యొక్క అనాది సిద్ధ రూపమును ప్రకటిస్తున్నవి. సకల సృష్టికాలవాలమైన సరస్వతి నాకు సకల వస్తు రూపముగా తోచినది.

అట్టి భావనయే సరస్వతీ సంబంధముగా సర్వమును చూచుటకు తావలమైనది అదియే ఈ సారస్వతీం భావయే అను గ్రంథ రచనకు పురికొల్పినది.

అక్షర పరబ్రహ్మ స్వరూపిణికిదే నా అక్షరార్చన. ఇట్లు భావించు వారికి తరించు మార్గము.

శ్రీ సరస్వతీ యజ్ఞసేవా సమితి తృతీయ వార్షికోత్సవాల సందర్భమున ముద్రణ కుపయుక్త ధనరూపసేవ చేసికొన గల్గిన రా॥ శ్రీ తాడుపునూరి శంకరయ్య (చేగుంట, మెదక్ జిల్లా) గారి కభీష్ట సిద్ధి నొసంగి అమ్మ రక్షించుగాక.

చూపులయే తడవుగా సూచనలందించి పరిశీలించి అమూల్యాభిప్రాయముల నిచ్చిన బ్ర॥ శ్రీ తిరుమల రామచంద్ర గారికి, బ్ర॥ శ్రీ తలముడిపి బాలసుబ్బయ్య గారికి నా కృతజ్ఞతా పూర్వక నమస్సులు.

తమ అమూల్య సమయాన్ని వెచ్చించి వెన్ను దట్టిన అక్కయ్య ఆచార్య శ్రీమతి కె. కమల, సంస్కృత శాఖ, ఉస్మానియా విశ్వ విద్యాలయము, హైదరాబాదు గారికి కృతజ్ఞతలు.

ముద్రణలో సంతతము సంపూర్ణాత్మీయ సహకారములందించిన కోదండ ప్రెస్ అధినేత శ్రీ బి. రాధాకిషన్ రావు గారికి శుభాశంసనములు.

అష్టకాల

(అష్టకాల నరసింహరామశర్మ)

# సరస్వతీ ప్రతి మహాత్మాం మహీయాత

ఇరవయ్యేదేళ్ల క్రిందట తెలంగాణా కల్లోల సమయంలో 'పీఠ
శీర్షికతో

"మోతాదులో వాడుకుంటే
విషం కూడ ఆరోగ్యాన్ని ఇస్తుంది.
మితి మించిన మీ వాదం
జగద్విలయానికి నాంది కారాదు.
మీమీ వర్గాలు కావు నిలవాల్సినవి
సత్యం ధర్మం నిలవండి
సత్యం శివం సుందరం
లోక క్షేమం దృష్టితో
మీరు కాంప్రమైస్ కమ్మని
సలహా యిస్తున్నాను"

అని ఆంధ్రప్రదేశ్ ప్రజా సంక్షేమైక దృష్టితో చక్కని తీర్పును గేయ
చెప్పిన శ్రీ అష్టకాల నరసింహ రామశర్మగారు,

"ఉర్విలోని సహనమ్ము సర్వమును
ఉవిదలోననే వ్యక్తమయ్యెడును
గర్వమెక్కుటే పురుష జాతికగు
సర్వమెరిగి శాసింతురు పురుషులు"

నూతన మాత్రా ఛ్ఛందస్సుతో "సతి" శీర్షికతో వర్తమాన పురుషాహం
రెండు దశాబ్దాల కిందటే ఈసడించిన శ్రీ అష్టకాల నరసింహ రామ:
తాము ప్రతిష్ఠించిన సరస్వతీ దేవిని స్తుతిస్తూ –

"శిష్టి వృష్టి సమష్టికా మతుల శిష్టాకృష్ట చారిత్రకాం
సృష్టి స్థిత్యవసాన కార్యచతురా మిష్టార్థ పుష్టి ప్రదామ్।
కష్టాష్టార్త నికృష్ట పాలన పర స్పష్ట ప్రభావా ద్భుతాం
ప్లిష్ట వ్యాధి సుధా ప్రసేచన కరీం సారస్వతీం భావయే." (24)

అని కష్ట ప్రాసతో మహా ప్రౌఢంగా సంస్కృత కవిత చెప్పినప్పుడు ఆశ్చర్యమే కలుగుతుంది. కాని, వీరి వంశం అష్టకాల వంశమని, నిరంతర వేదాధ్యయనంతో సకలాష్టకాలు వాచోవిధేయమయిన వంశం వారు ఇలాటి కవితే కాదు, ఇంతకన్నా ప్రౌఢ కవిత సరస్వతీ కటాక్షంతో సహజాతి సహజంగా చెప్పగలరని తెలిసినప్పుడు ఆశ్చర్యమేమీ కలుగదు.

కవితకు అప్పుడూ, ఇప్పుడూ లక్ష్యముంది. కవిత కేవలం ఆత్మనిష్ఠ భావ ప్రకటన మాత్ర పర్యవసాయిని కాదని, దానికి ప్రేరకం శోకమే కాక ఆనందమూనని నేను విశ్వసిస్తున్నాను. శోకమంటే అధర్మాన్ని ఎదిరించి ధర్మాన్ని ప్రతిష్ఠించాలనే ఆవేదన; ఆనందమంటే, ధర్మం ఏ రూపంలో, ఏమేర ప్రతిష్ఠితమైనా పరవశించే తృప్తి. శ్రీ శర్మగారికి ఈ రెండింటి అనుభవానుభూతులూ దశాభేదంతో పుష్కలంగా కలిగాయి. ప్రథమ దశలో పడిన ఆవేదనంతా కలసిపోయి, తమ కలలంతా నిక్కలలయాయి; ఆనందం వెల్లివెరిసింది; సరస్వతిని సర్వాంతర్యామినిగా, సృష్టి స్థితి లయ రూపిణిగా, పరతత్త్వంగా, సకల దేవతా స్వరూపిణిగా కీర్తించారు.

"యజ్ఞాం యజ్ఞమయీం యజత్సుఫలదాం యజ్ఞేశ్వరీం యాజ్ఞికాం
యజ్ఞానీం జపయజ్ఞ సుజ్ఞమహితా మజ్ఞాన సుజ్ఞానదామ్,
ప్రజ్ఞామూర్తి మధిజ్ఞ గర్వభిధురా మాజ్ఞప్త సర్వామరాం
జిజ్ఞాసుజ్ఞ కళావతీం భగవతీం సారస్వతీం భావయే." (28)

అని శర్మగారు చేసిన స్తోత్రంలో మధుచ్ఛందుడు దర్శించిన

"అగ్నిమీళే పురోహితం
యజ్ఞస్య దేవ మృత్విజం
హోతారం రత్నధాతమమ్".

అనే ఋగ్వేద ప్రథమమంత్ర సుగంధాలు పొంగుతున్నాయి; భగవద్గీతలోని పరిమళాలు గుబాళిస్తున్నాయి. శ్రీ శర్మగారు యోగమంత్ర తంత్రాయుర్వేదాది శాస్త్రజ్ఞులు. తమ విజ్ఞానమంతా ఈ శతకంలో కుమ్మరించారు.

"ఈంకారీం నిగమాద్యనాద మహితాం సంకీర్ణ సంకీర్తనాం
అంకోత్కాసుర దర్పభంజన పరాం సంకోచ పంకాంకితామ్,
సంకార ధ్వని సంకులాజ్యహవనాం సంకల్ప కూలంకషాం
శంకారాయతమానసాం భగవతీం సారస్వతీం భావయే." (100)

ఈ శ్లోకంలోని ఈంకారం ఓంకారానికి పూర్వ నాదం.

"రాధాం రాతిహితప్రదాం సుమణిపూ రాధారచక్ర స్థితాం
స్వాధిష్ఠాన గతామనాహత విశు ద్ధాజ్ఞాబ్జమధ్య స్థితామ్.
ఆధివ్యాధిహరాం సహస్రదళ పద్మాధేయినీం ధ్యేయినీం
మేధావృద్ధికరీం పరాం భగవతీం సారస్వతీం భావయే."

ఈ శ్లోకంలోని మణిపూర, ఆధార, అధిష్ఠాన, అనాహత, ఆజ్ఞా చక్రాలు, సహస్రదళ పద్మ సహస్రారం – ఇవన్నీ మంత్ర శాస్త్ర వేదిత్వానికి తార్కాణాలు. రాధ కాంతి. తర్వాత ఒక వైష్ణవశాఖకు మూలమైన రాధాదేవి.

శ్రీ శర్మగారు సరస్వతిని సర్వ శుక్లగానే కాక వివిధ వర్ణగాను, వర్ణమూల వర వర్ణిని గాను వర్ణించారు ఈ క్రింది శ్లోకంలో :

"వర్ణాం వర్ణిత వర్ణికా రుచిరతాం వర్ణాటగానప్రియాం
వర్ణావర్ణన వాగ్విలాస మహితాం వర్ణప్రియాం వర్ణినీమ్,
వర్ణాట ప్రతిభా ప్రభావిత తనూం వర్ణాఖిలావాసినీం
వర్ణప్రక్కర శోభినీం భగవతీం సారస్వతీం భావయే". (75)

ప్రతిమాటకూ రంగూ రుచీ వాసనా ఉందనే వారు మహా వైయాకరణులు మహామహోపాధ్యాయ మాధవ శాస్త్రీ భండారీగారు. ఈ శ్లోకం చదివిన తర్వాత గాని ఆ విషయం సరిగ్గా నాకు అవగతం కాలేదు. ఇక్కడ వర్ణాటులు గాయకులు, చిత్రకారులు, కవులు.

శ్రీ శర్మగారు కానీనికా, రాతి, అంక, యజ్ఞానీ, చార్వీ మొదలయిన అపూర్వ ప్రౌఢ ప్రయోగాలు చేశారు. అవి వేదగంధం, హవిర్ద్రవ్యగంధం వెలువరిస్తున్నాయి.

శ్రీ శర్మగారు ఆంధ్ర, తమిళ, కర్నాటక సాహిత్య కవితా సంప్రదాయబద్ధమైన ద్వితీయాక్షర ప్రాసను అసిధారావ్రతంగా పాటిస్తూ వర్ణాటులందరికీ వర్ణికగా (ఉదాహరణ ప్రాయంగా) ఈ శతకం రచించారని పిస్తుంది. భగవచ్ఛంకరులు, వేదాంత దేశికులు, మూకకవి, తిరుమల బుక్కపట్నం కిరీటి వేంకటాచార్యులు, శ్రీ కృష్ణబ్రహ్మ తంత్ర పరకాల మహాదేశికులు, ఇలా ద్వితీయాక్షర ప్రాసతోను, యతి స్థానంలో విరామంతో పాటు అక్షరావృత్తితోను రచనలు చేసినవారే. శ్రీ శర్మగారి కవితా కామనీయకానికి ఎన్ని ఉదాహరణలు ఇవ్వమంటారు? శతకమంతా ఇవ్వదగిందే.

సారస్వతీం భావయే – అని శ్రీ శర్మగారు మకుట ప్రాయమైన వాక్యం ప్రతి శ్లోకం చివర చేర్చారు. సరస్వతీం భావయే అని ఉండాలి గదా, సారస్వతీం ఏమిటబ్బా? – అని సామాన్య పాఠకునికి విచికిత్స కలుగడం సహజం. సారస్వతుడనే

వైదిక ఋషి విరాజిల్లుతున్నాడు. అతడు సరస్వతిని సాక్షాత్కరించుకొన్నవాడు. అతనికి సంబంధించినది, అతనికి సాక్షాత్కరించినది, అతనిని అనుగ్రహించినది సారస్వతి. ఈ దృష్టితో శ్రీ శర్మగారు "సారస్వతీం భావయే" అని ప్రయోగించారని నేను భావిస్తున్నాను.

అత్యాధునిక తెలుగు కవితతో పాటు గీర్వాణ కవితనూ తురాషాట్ సూనుని వలె కదం తొక్కించే శ్రీ శర్మగారి సరస్వతీ కటాక్ష తుందిలమైన వాగ్ధాటిని, సంస్కృత స్తోత్ర సాహిత్యంలో ఉత్తమ శ్లోకుల స్తోత్రాల సరసన, సరసతతో నిలువగల ఈ స్తోత్రాన్ని వినమ్రతతో ప్రశంసిస్తూ, సహృదయ పాఠకులు ఈ స్తోత్రం పఠించి సరస్వతీ కృపకు పాత్రులు కావాలని కోరుతూ, కాగలరని విశ్వసిస్తున్నాను.

భాషా సేవకుడు

తిరుమల రామచంద్ర

హైదరాబాద్ - 380
భావ మాఘ పూర్ణిమ
15-2-95

# సారస్వత లహరి

'లక్ష్మీ ప్రదాన సమయే నవవిద్రుమాభాం
విద్యా ప్రదాన సమయే శరదిందు శుభ్రాం। 66
విద్వేషివర్గ విజయే తు తమాలనీలాం
దేవీం త్రిలోక జననీం శరణం ప్రపద్యే॥

ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తుల ఐక్య ప్రేరణతో జగన్మాత సమస్త జీవరాశినీ
నడిపిస్తున్నది. ఈశ్వరుడు కూడా శక్తిమంతుడైతేనే ఏ పనికైనా సమర్థుడౌతాడు. 67
సకల జనని కటాక్ష వీక్షణాలకు పాత్రులైన వాళ్ళకు అసాధ్యమే ఉండదు -

'భక్తిశ్చేదవినాశినీ భగవతీ పాదద్వయీ సేవ్యతాం
ఉన్నిద్రాంబురుహాతపత్ర శుభగా లక్ష్మీః పురోధావతి ।'

నిరంతరాయమైన భక్తితో ఆ మాతృమూర్తిని సేవించే బిడ్డలకు సర్వసిద్ధులూ 68
వశమౌతాయి.

ఆ జగజ్జనని కరుణాపాంగరేఖా లాలితులు శ్రీ అష్టకాల నరసింహ రామశర్మగారు. శర్మగారి ప్రసక్తి వస్తూనే అనంతసాగరంలోని సరస్వతీ మూర్తి కనులముందు సాక్షాత్కరిస్తుంది. వారు నిరంతర సాకార, నిరాకార సారస్వత సేవా
పరతంత్రులు. 69

అవధాన విద్యలో సిద్ధహస్తులైన అష్టకాలవారు గీర్వాణ వాణిలో వాగ్దేవీ వైభవాన్ని పెక్కు విధాలుగా కీర్తించారు. వారి తపన ఎడతెగకుండా స్తోత్రమంజరులను వెలయిస్తూనే ఉంది. శర్మగారి అభినవ మనః పల్లవమే ఈ సరస్వతీ శతకం.

70

'భగవతీం సారస్వతీం భావయే' అను మకుటంతో 116 శార్దూల
వృత్తాలలో ఈ శతకం శారదామాత సమగ్ర విలాసాన్ని విశదీకరించింది. అపక్వాహార
రూపమైన ఏకభుక్తితో గూడిన అనవరత తాపసిక దీక్షకు ఫలంగా శర్మగారి
అంతరంగాన్ని సరస్వతీ భావన గాఢంగా ఆవరించింది. ఆ సంకుల భావ
66 పరంపరనే సరస్వతీ శతక లహరిగా ఉద్గమించింది.

'మనో హి సరస్వాన్, వాక్ సరస్వతీ ఏతౌ సారస్వతౌ వృధౌ'

అంటూ శతపథ బ్రాహ్మణం మనోవాక్కులు రెంటినీ ఏకరూపంగా సారస్వతాలనే
వ్యవహరించింది. మనస్సు సరస్వాన్ అనీ, వాక్కు సరస్వతి అనీ ఈ రెండూ
67 సారస్వత మోహాలనీ, ఊటబావుల్లో నీళ్ళు తోడేకొద్దీ ఊరికే రీతిగా, విజ్ఞాన
విషయాలను మననం చేసేకొద్దీ నూత్న నూత్నాంశాలు స్ఫురిస్తాయనీ, వేదవాక్కు
సరస్వతీ రూపిణియై వివిధార్థాలను వేదవిదునికి ప్రకాశింప చేస్తుందనీ సాయణాచార్యులు
భాష్యం చెప్పారు.

'దృశ్యం దృశ్య సమస్త భౌవన విభా మిథ్యా ప్రబోధాత్మికాం
68 దృశ్యా దృశ్య నిరూఢ యోగ మహితాం దృగ్దృశ్య లీలాదరాం।
దృశ్యార్థా వగతి ప్రసాదకరణాం సాదృశ్య వైశేషికాం
దృశ్యాంభోజకళాధికాం భగవతీం సారస్వతీం భావయే॥'

ఇలా దుష్కర ప్రాసలు, అనుప్రాసలతో జటిలంగా సాగుతుంది స్తోత్ర
రచన. పదసంయోజనం, సమాసఘటనలు పని గట్టుకొని కూర్చినట్లుగ కాకుండా
69 శర్మగారి సంకల్పం నుండి యథేచ్ఛగా రూపుదిద్దుకున్నాయి.

'దృశ్యం' – అంటే మనకు కనపడే ఈ అనంతమైన జగత్తు. ఇదంతా ఆ
జగన్మాత విలాసమే.

'దృశ్య సమస్త భౌవన విభా మిథ్యా ప్రబోధాత్మిక' – అంటే కనపడే ఈ
70 జగత్తు నశించేది (యద్దృశ్యం తన్నశ్యం) కనుక ఇదంతా మిథ్య అంటే లేనిదే అనే
జ్ఞానంతో భౌతిక వ్యామోహాన్ని అరికట్టేదీ ఆమెయే.

'దృశ్యాదృశ్య విరూఢ యోగ మహితే' - అంటే ఈ దృశ్య జగత్తుకూ, దానికి మూలకారణమై అదృశ్యంగా ఉండే పరమాత్మ తత్త్వానికీ ఐక్యానుసంధానాన్ని కలిగించే శక్తి కూడా అమ్మయే.

'దృగ్దృశ్య లీలాదరే' - అంటే అనుభవ యోగ్యమైన జగత్తుకూ, అనుభవ కారణమైన ఇంద్రియాలకూ సంబంధించిన లీల అంటే - జనన మరణ చక్రంతో కూడిన ఈ నిరంతర సృష్టిని కొనసాగించే విలాసంతో ఒప్పేది.

'దృశ్యార్థా వగతి ప్రసాద కరణే' - అంటే ప్రాపంచిక విషయాలను అర్థం చేసుకోవడానికి అవసరమైన జ్ఞానేంద్రియ పంచకాన్నీ, అంతఃకరణమూ ప్రసాదించింది జగన్మాతయే -

'నానాచ్ఛిద్ర ఘటోదర స్థిత మహా దీపప్రభా భాస్వరం
జ్ఞానం యస్యతు చక్షురాది కరణ ద్వారా బహిస్స్పందతే ।'

అంటూ ఆదిశంకరులు దక్షిణామూర్తి స్తుతిలో ఈ విషయాన్ని అద్భుతంగా వ్యాఖ్యానించారు.

'సాదృశ్య వైశేషికే' - అంటే లోకంలోని సమస్త విషయాలకూ ఉపమాన రూపమైనది. జగత్తు ఉపమేయమైతే, పరమాత్మ ఉపమానం. ఈ ఉపమానోపమేయాల అభేద రూపమైన రూపక స్థితే పరమాత్మ విలాసం.

'దృశ్యాంభోజకళాత్మికే' - అంటే ఈ కనపడే చంద్రుని కంటే అధికమైన ఆత్మకళతో ఒప్పేది ఆదిశక్తి. ఆత్మచంద్రునికి లోకచంద్రునిలాగా ఉదయాస్త మానాలూ, వృద్ధిక్షయాలూ ఉండవు. 'తస్య భాసా సర్వమిదం భాతి' అనే విధంగా అది సహజ నిత్య ప్రకాశరూపమైనది. కేవల సుఖ స్థితిలో మచ్చ లేకుండా అంటే ద్వైత భావ రహితమై, అఖండంగా, అద్వైతంగా ప్రకాశించే ఆత్మతత్త్వాన్ని ఇది వ్యాఖ్యానిస్తున్నది -

'నోదేతి నాస్తముపయాతి న వృద్ధి మేతి
నాపిక్షయం చ భజతే నిజతేజసేద్ధః ।
పూర్ణస్సదైవ సహజేన సుఖామృతేన
నిర్లాంఛనః కోఽపి నిజాత్మ చంద్రః ॥'

స్వారాజ్య సిద్ధి సురేశ్వరాచార్యులు

అంటూ తత్త్వజ్ఞులు ఆత్మతత్త్వాన్ని ప్రబోధించారు.

ఇలా వ్యాఖ్యాన సాపేక్షకంగా సాగింది ఈ శ్లోకం. ఇలాంటివెన్నో ఈ సరస్వతీ శతకంలో దర్శనమిస్తాయి. అక్కడక్కడా కొన్ని క్లిష్టపదాలకు శర్మగారే అర్థనిర్దేశం చేసినందువల్ల కొంత అవగాహన సౌకర్యం కలిగింది.



శరీరమనే ఈ ఉపాధిలో ప్రాణశక్తి, ఇంద్రియశక్తి, మనశ్శక్తి, బుద్ధిశక్తి అనే విధమైన భిన్న శక్తుల రూపంలో వ్యక్తమైనా – సుఖమయమైన ఆత్మప్రకాశం ఒక్కటే –

'ఏకామేక పదీమనేక చతురామేకాంతవాసప్రియాం
ఏకాగ్రస్థిర పూజనాదరగుణా మేకీకృతానేకతాం ।
నైకా మేకధురావహం సమపదామైకైక ధర్మస్థితాం
ఏకాదశ్యనునాదన ప్రచరితాం సారస్వతీం భావయే ॥' (116)

'ఏక' ఉత్పత్తి నాశాలు లేని అక్షరరూపమైన శబ్దబ్రహ్మమే – అర్థభావంగా అంటే జగద్రూపంగా వివర్తమైంది.

'ఏకపద' అంటే ఈ జగత్తు ఉత్పత్తి, స్థితి, నాశాలన్నిటికీ బ్రహ్మమొక్కటే స్థానమైనది.

'అనేక చతుర' అంటే అనేక నైపుణ్యాలు కలది –

'ఏకమేవ యదామ్నాతం భిన్నం శక్తి వ్యపాశ్రయాత్ ।
అపృథక్త్వేపి శక్తిభ్యః పృథక్త్వేనేవ వర్తతే ॥'

(వాక్యపదీయం – భర్తృహరి)

నిజరూపంలో భేదరహితమైన బ్రహ్మమొక్కటే అనేక శక్తులకు ఆశ్రయమైంది. అందువల్ల భిన్నభిన్న రూపాలల్లో, భిన్న భిన్న శక్తులతో వ్యక్తమైనా అంటే అది తన యందలి శక్తుల కంటే వేరైనది కాకపోయినా వేరుగా రూపాంతరంతో భాసిస్తున్నట్లే ఉంటుంది.

శక్తులు భిన్నాలైనా వీటన్నిటికీ అనుభవంలో ఏకతయే ఉంటుంది. అయినా ఈ ఇంద్రియాది శక్తులకు అతీతంగా తెలియదగినదే ఆత్మ చైతన్యం–

'బాహ్యార్థాన్ కరణగణేన, తం చ బుద్ధ్యా,
బుద్ధిం యః ప్రథయతి స్వభాసా ।
ఆత్మాఽసా వనధిగతః పరాగ్భిరేభిః
విజ్ఞేయస్తనుభవనాంతర ప్రదీపః ॥'

(స్వారాజ్య సిద్ధి)

జగత్తులోని సర్వవస్తువులనూ ఇంద్రియాల ద్వారా, ఆ ఇంద్రియాలను బుద్ధి ద్వారా, బుద్ధిని తన ప్రకాశంతో ఎప్పుడూ ప్రకాశింపజేస్తూ, వీటన్నిటికంటే లోపలగా ఉన్నందున వాటికి ఎరుగరానిదై నిత్యమూ శరీరమనే గృహం మధ్యలో వెలిగే దీపస్వరూపమైన ఆత్మతత్త్వమే వాస్తవంగా తెలుసుకోవలసిన అంశం.

'ఏకాంతవాసప్రియ' అంటే హృదయమనే పుండరీక మధ్యంలో నిత్యంగా నివాసముండేది –

'పద్మకోశ ప్రతీకాశం, హృదయంచాప్యధోముఖం ।
అధోనిష్ట్యావితస్త్యాంతే నాభ్యాముపరితిష్ఠతి ॥"

అంటూ శ్రుతి పరమాత్మ ఉనికిని స్థాపించింది. పరిచ్ఛేద, వినాశాలు లేనిదై జ్ఞానరూపంతో ఉండే ఆత్మతత్త్వాన్ని అవగాహన చేసుకుంటే, సాంసారికమైన సర్వదుఃఖాలు తొలగి, సుఖోత్పత్తి కలుగుతుంది. ఆ ఆత్మతత్త్వం అష్టదళ కమలంలోని కోశం యొక్క మధ్యలో వివరంలాగా ఉండే హృదయం అనే భాగంలో ఉంటుంది. ఈ హృదయపద్మం లోకంలోని పద్మాల్లాగా కాకుండా అధోముఖంగా ఉంటుంది. సర్వమూ దానిలోనే ప్రతిష్ఠితమై ఉంటుంది.

'ఏకాగ్రస్థిర పూజనాదర గుణ' అంటే హృదయాకాశంలోని బ్రహ్మత్వాన్ని ఉపాసించటం –

'దహ్రం విపాపం పరమేశ్మభూతం
యత్పుండరీకం పురమధ్య సంస్థం।
తత్రాపి దహ్రం గగనం విశోకం
తస్మిన్ యదంతస్తదుపాసితవ్యం।

అంటూ శ్రుతి తనలోని తత్త్వాన్ని (ఆత్మతత్త్వాన్ని) తెలియడానికై సూక్ష్మోపాయాన్ని స్పష్టంగా నిర్దేశించింది. సూక్ష్మంగా, పాపరహితంగా, పరతత్త్వానికి స్థానంగా ఈ శరీరంలోనే ఉన్న హృదయపుండరీకంలోని తత్త్వాన్ని, తనకంటే విజాతీయమైనవి లేదనీ, ఉండేదంతా సజాతీయమే అనే విశ్వాస ప్రవాహంగా ఏకాగ్రభావంతో ఉపాసించడమని అర్థం.

'ఏకీకృతానేకత' అంటే జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి అనే అవస్థలన్నిటిలోనూ, సమస్త జీవరాశిలోనూ ఏకరూపంగా ఉండే జ్ఞాన ప్రకాశ స్వరూపమైనది –

'జాగ్రత్స్వప్న సుషుప్తిషు స్ఫుటతరాయా సంవిదుజ్జృంభతే
యాబ్రహ్మాది పిపీలికాంత తనుషు ప్రోతా జగత్సాక్షిణీ ।'

అంటూ శంకరులు మనీషా పంచకంలో వ్యాఖ్యానించారు. 'నైక' అంటే జీవుడు, జగత్తు, అనుభవం మొదలైన అనేక స్థితులుండేది –

'ఏకస్య సర్వబీజస్య యస్య చేయమనేకధా ।
భోక్తృ, భోక్తవ్య రూపేణ భోగ్యరూపేణ చ స్థితిః ॥'

(వాక్యపదీయం)

సర్వజగత్తుకూ మూలకారణమై, అద్వితీయమైన బ్రహ్మమే జీవుడు, విషయము (జగత్తు), సుఖదుఃఖాద్యనుభవాలు అనే భిన్న స్థితుల్లో వివర్త రూపమైన ఉనికిని పొందేది. 'ఏకధురావహ' అంటే సర్వజగత్తు భారాన్ని మోసేది. 'సమపద' అంటే సమస్త జ్ఞాన రూపమైనది. (ప్రజ్ఞాన ఘన స్వరూపమైనది).

'ఏకైక ధర్మస్థిత' అంటే ఎల్లప్పుడూ స్వభావంలోనే ఉండేది – 'స్వభావే వర్తతేలోకః'.

అంటూ ఇలా శర్మగారు అద్భుత పదసంయోజనంతో నిరాకార, నిర్గుణ తత్త్వాన్ని వ్యాఖ్యానించే విధంగా ఈ శ్లోకాన్ని నడిపి, చివరగా జగన్మాత సగుణ సాకార తత్త్వాన్ని 'ఏకాదశ్యనునాదన ప్రచలితాం' అంటే పదకొండు నాదతంత్రులుండే పరివాదిని అనే వీణావాదన ప్రియ అయిన సరస్వతిని సాక్షాత్కరింప జేశారు.

ఇంకా –
'గౌరీ మిమాయసలిలాని
తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ ।
అష్టాపదీ నవపదీ బభూవుషీ
సహస్రాక్షరా పరమే వ్యోమన్ ॥'

అనే మంత్రార్థం కూడా ఈ శ్లోకానికి వర్తిస్తుంది. శబ్ద బ్రహ్మాత్మిక అయిన వాణి ఉచ్చారణ శబ్దరూపాన్ని పొందుతున్నది. అవ్యాకృతాత్మ భావంతో సమస్త ప్రాణులకూ, వాచక శబ్దాలకూ సార్థక్యాన్ని కలిగిస్తూ, సుబంతతిఙంతాలనే రూప భేదాలతో పదద్వయవతియై, నామ, ఆఖ్యాత, ఉపసర్గ, నిపాత రూపాలుగా గానీ,

పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూపాలుగా గానీ చతుష్పదియై, సప్త విభక్తులూ, ఆ మంత్రణాలనే అష్ట భేదాలతో అష్టాపదియై అవ్యయంతో కలిసి నవపదియై, సహస్రాక్షరాలతో అంతరిక్షమంతా వ్యాపించి ఈమె గౌరీ స్వరూపయై ఉన్నది. (సర్వ శుక్లా) అని కూడా అన్వయించుకోవచ్చు.



'భవతు సుఖకరీ ప్రాణశక్తిః పరానః' - సర్వోత్కృష్టమైన ప్రాణశక్తి మాకు సుఖాన్ని కలిగించేదిగా కావాలి అంటూ జగన్మాతను వేడుకో వలసిందే -

'హంసాం హంసవరాధిరూఢ గమనాం హంసాక్షరోత్తంసినీం
హంసాంతాక్షరరూపిణీం అజరతాం హంసాంతరావాసినీం ।
హంసేందు ప్రతిభాసితాక్షియుగళాం హంసస్తుతాం హంసినీం
హంసత్వాం పరరూపిణీం భగవతీం సారస్వతీం భావయే ।' (27)

'హంస' అంటే ఉచ్ఛ్వాస, నిశ్శ్వాసరూపమైన ప్రాణశక్తి. హంస శబ్దం పరమాత్మ బోధకం. అది జగద్వ్యాప్తమైన చైతన్యరూపం. నిరస్త సమస్తోపాధికమైన బ్రహ్మ ఒక్కటే అనే విషయాన్ని స్థాపించేదే హంస పదం. అంతటినీ ఎల్లప్పుడూ నిండియుండేది హంస అని అర్థం (సర్వత్ర సర్వదాగంతా యో హంసః). 'హంస' అనేదాన్ని త్రిప్పి పలికితే 'సోఽహం' అవుతుంది.

'హంసాంతరావాసిని' అంటే సూర్యమండలాంతస్థిత చైతన్యరూపిణి - "ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ".

'హంసేందు ప్రతిభాసి తాక్షియుగళ' అంటే సూర్యచంద్రులే కన్నులుగ గలది.

'హంసత్వ' అంటే 'అహం బ్రహ్మాస్మి', 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' అనే మహా వాక్యాల సారభూతమై, శుద్ధ సత్త్వరూపమైన బ్రహ్మ జ్ఞానాన్ని ప్రసాదించేది.

'హంస స్తుత' అంటే యోగీశ్వరులచేత కీర్తింపబడేది -

'ధ్యానాభ్యాసవశీకృతేన మనసా యన్నిర్గుణం నిష్క్రియం
జ్యోతిః కించన యోగినో యది పరంపశ్యంతి పశ్యంతితే' ।
(గూఢార్థదీపిక - మధుసూదన సరస్వతి)

అంటూ తత్త్వజ్ఞులు యోగీశ్వరుల చిత్తైకాగ్రతను స్పష్టపరచారు.

'హంసిని' అంటే శక్తి స్వరూపమైనది అంటూ ఉండే ఈ నిరాకార నిర్గుణ తత్త్వబోధక పదఘటనలో 'హంస వరాధి రూఢగమన' అంటే హంస వాహన సమాయుక్త అనే సగుణసాకార తత్త్వాన్ని జోడించడంలో శర్మగారికిగల సాకార నిరాకార తత్త్వాద్వైతభావన వ్యక్తమగుచున్నది.



ఈంకారీం నిగమాద్యనాదమహితాం సంకీర్ణ సంకీర్తనాం
అంకోత్కాసుర దర్పభంజన పరాం సంకోచ పంకాంకితాం ।
సంకారధ్వని సంకులాజ్యహవనాం సంకల్ప కూలంకషాం
శంకారాయిత మానసాం భగవతీం సారస్వతీం భావయే ॥ (100)

'ఈంకారి' అంటే ఈమె మహామాయనూ, జగత్తంతా నిండిన అంతర్మాయనూ వశం చేసుకునే సర్వాకర్షణలతో ఒప్పే మాయాధి దైవతమైనది -

'మాయా దైవత్వమీకారం
మహామాయాం వశీకరం ।
అంతర్మాయా జగద్వశ్యం
వశీకర్యం వరాననే ।' (బీజాక్షర నిఘంటువు)

లక్ష్మీ సరస్వతి రూపమైనది - ఈ కారోబ్జదళేలక్ష్మ్యాం, వాణ్యాం కమల కేసరే। (రత్నమాలాభిధానము)

'నిగమాద్య నాద మహిత' అంటే జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయావస్థలనే చతుష్పాత్ బ్రహ్మ నిరూపణ రూపమైన ఓంకార నాదమహిత.

'సంకీర్ణ సంకీర్తన' – అంటే పెక్కు . బుగా కీర్తించబడేది.

'అంకోత్కాసుర దర్ప భంజన పర' అంటే మధుకైటభులు, చండముండులా మొదలైన సర్వ రాక్షసులును సంహరించి, సురారులమ్మ కడుపారడి బుచ్చిన అమ్మ.

'సంకోచ పంకాంకిత' – సంకోచం అనేది జాగ్రదవస్థకు సంకేతం. ఇది స్థూల శరీరాభిమానంతో సమస్త రాగద్వేషాలనే బురదతో కూడినది –

'సంకోచ సంశ్రయణ వర్జన భావభంగ్యా
జాగ్రత్సుషుప్తి దశమోర్గమకౌ ప్రయత్నే ।
ద్వ్యాస్పృష్టతా వివృతతే విదితా సుధీభిః
స్పర్శ స్వరాక్షర గతౌ పరిశీలయామః ॥' మాతృకాచక్ర వివేకం.

అచ్చులను పలికేటప్పుడు నోరు వివృతమౌతుంది. హల్లులను పలికితే నోరు ముడుచుకుంటుంది. హల్లులు కంఠము, తాలువు మొదలైన వాటి సంఘట్టన రూపంగా వెలువడుతాయి. అట్లే విషయాలను గ్రహించే జాగ్రత్ దశలో పాత్మకు సంకోచం కలుగుతుంది. విశ్రాంతి స్థానమై నిర్విషయ రూపమైన సుషుప్తిలో పూర్ణభావమే ఉంటుంది. అయితే ఈ ఉపాధిగతమైన అంతఃకరణ చైతన్యమే పరతత్త్వానుభవానికి హేతువు.

'సంకల్ప కూలంకష' అంటే ఇష్టప్రాప్తి, అనిష్ట నివారణలనే ఒడ్డులను ఒరుసుకునే ఇచ్ఛాతరంగ పరంపరా సహితమైన మనః ప్రవాహ రూపమైనది.

'సంకారధ్వని సంకులా జ్యాహవన' అంటే యజ్ఞప్రియ.

'శంకారాయతమానస' అంటే శోభనకారిణి.

ఇలా జగన్మాత నిరాకార, నిర్గుణ స్వరూపాన్ని భావించారు శర్మగారు.

నిర్గుణోపాసన కైవల్య స్థితికి మూలం. అయితే యోగ్యులైన వాళ్ళకే ఇలాంటిది సాధ్యం. సాధారణ మానవులమైన మనం అర్చారూపాలను ఆశ్రయించాల్సిందే –

'అంబా మంబుజగర్భ నిర్భర దృశా సంబాధితాంగాంగినీం' (29)

'కంఠాలంబిత హేమదామ మహితాం కంఠేరలక్ష్మీప్రదాం' (88)

మొదలైన పెక్కు శ్లోకాల్లో శర్మగారు అమ్మవారి సాకార స్థితిని వర్ణించారు. ఇలా విగ్రహారాధన చేయడంలో దరిద్రమూ, ఆపదలూ తొలగి లౌకిక సౌఖ్యం కల్గడమనే అవాంతర ఫలాలు కూడా లభిస్తాయి.

ఇక్కడ ఇలా దిక్ప్రదర్శకంగా మాత్రమే సరస్వతీ శతక వైశిష్ట్యాన్ని పేర్కొనడం జరిగింది. ఆలోచించి అందుకోగల వాళ్ళకు అందులోని సమగ్ర స్వరూపం అవగతమౌతుంది.

శ్రీ అష్టకాల నరసింహ రామశర్మగారు సారస్వతోపాసకులైన ధన్యజీవులు. వారి కృషి నిరంతరం అభ్యుదయ నిశ్శ్రేయసాలను కలిగించాలని మనస్ఫూర్తిగా ఆకాంక్షిస్తున్నాను.

'భయాత్త్రాతుం దాతుం ఫలమపిచ వాంఛాసమధికం
శరణ్యే లోకానాం తవ హి చరణావేవ నిపుణౌ ।'

ఈ నాలుగు మాటల మిషతో జగన్మాతను స్మరించుకునే అవకాశాన్ని నాకు కల్పించిన శర్మగారికి ధన్యవాదాలతో –

సిద్ధిపేట — తలముడిపి బాలసుబ్బయ్య
2-2-95

# సారస్వతీం భావయే

స్వచ్ఛా మచ్ఛ వళక్షచీరరశనాం మల్లీమతల్లిస్రజాం
ముక్తాహార మనోహరాం సితసరోజాలోల లీలాంబకాం
స్ఫాటిక్యాక్ష సుమాలికాం భగవతీం శ్వేతాబ్జ సంవాసినీం
భక్తానా మభయాం మరాళ గమనాం సారస్వతీం భావయే. 1

శ్యామాంభోద వినీల దీర్ఘ చికురాం నీలాభకానీనికాం
శైవాలాభవళిత్రయాం మకరికా పత్రాభిరామాం రమాం
సౌవీరాంజనరాజితాక్షియుగళాం సౌదామినీ భామినీం
అజ్ఞానాంధవినాశనామలరుచిం సారస్వతీం భావయే. 2

శోణాం శోణసుధాధరాం కుపిత కాలేశోణ పూర్ణేక్షణాం
వీణావాదనశోణితాంగుళియుతాం శోణాంఘ్రియుగ్మాం పరాం
మాణిక్యాంచిత నూపురాంగదమణి గ్రైవేయహారోజ్జ్వలాం
శోణాంకాంకలలాటికాం భగవతీం సారస్వతీం భావయే. 3

విద్యా మాద్య కృతోద్యమా మవిరతా మాతోద్య నాదోద్యతాం
విద్యుచ్ఛోద్యపదానవద్య కవితా సద్యస్ఫురత్ప్రాభవాం
ప్రద్యుమ్న ప్రతిపాద్యదోష ఫలదాఽవిద్యా తమఃఖండనాం
విద్యోద్ద్యోతిత వైభవాం భగవతీం సారస్వతీం భావయే 4

ఈశా మీప్సిత దాయినీ మిహఫలైశ్వర్యాశయాశ్వాసినీం
ఆశాపాశవినాశనామలపదా మాశ్చర్య కృత్కారణాం
కాశాగ్రాశు నిరస్త దోష నిచయాం క్లేశాంతకౌశల్యకాం
ధీశాం శారద పూజనాం భగవతీం సారస్వతీం భావయే. 5

విశ్వాం విశ్వజనీన భావ సులభాం విశ్వప్రభావాద్భుతాం
విశ్వామోదకరీం సమాశ్వసనదాం విశ్వేడ్య విశ్వంభరాం
విశ్వాంతర్బహిరుజ్జ్వలాం సురనుతాం విశ్వాక్షరాం విశ్వదాం
విశ్వైశ్వర్య పదాలయాం భగవతీం సారస్వతీం భావయే. 6

శిక్షాం శిక్షకశిక్షకీం నిగమ శిక్షాదక్ష సాపక్షికాం
రక్ష శ్శిక్షణ దీక్షితా మభయదా మక్షాంతి పక్షోద్ధతాం
అక్షోభక్షితిరక్షకీం కరధృతాక్ష స్రగ్విలా సోజ్జ్వలాం
వీక్షామాత్ర సమస్తదాం భగవతీం సారస్వతీం భావయే. 7

లోకానుగ్రహకారిణీం శుకపికాలాప ప్రకారాదరాం
పాకారి ప్రముఖామరార్చిత పదాం సాకల్య సాకర్యదాం
ప్రాకామ్యాంత భగాష్ట భాగ్యఫలదాం సైకాతిసైక స్థితాం
తోకస్తోక గుణాంతకాం భగవతీం సారస్వతీం భావయే. 8

వాణీ మైణగణాకులాంబకగణాం పాపాంబుధిద్రోణికాం
వీణాక్వాణ సమాను నర్తన లసత్పాణ్యంగుళీ మంగళాం
శ్రేణీభూత సమస్త మాన్య గుణదాం గీర్వాణ గీర్వాణదాం
వేణీ నిర్జిత నీరదాం భగవతీం సారస్వతీం భావయే. 9

అంగాష్టాద్భుత సంగతాం వరకృపాపాంగాం గుణాంగీకృతాం
సంగీతాద్భుత సంగినీం సుమసమానాంగాం పరేంగ ప్రియాం
గంగాసంగమ మంగళాం ప్రహసన వ్యాసంగ విస్సంగినీం
మాంగల్యాకర రంగభాం భగవతీం సారస్వతీం భావయే. 10

ఐంకారీం పద కింకిణీ క్వణన నాద బ్రహ్మ రూపాంకితాం
క్రేంకారారవ మోదినీం సురగణాహంకార హుంకారిణీం
శంకాతంకహరాం విశంకటదయాం కైంకర్య సాంకారికాం
పంకేజాత నివాసినీం భగవతీం సారస్వతీం భావయే. 11

హ్రీంకారీం పదకింకరీకృత సమస్తాదిత్య సర్వాంకురాం
టంకారాకులితాసురాం మృగమదాంకాంచత్స్వరాగాంకితాం
సాంకట్యాపచితాం మృగాంక సుముఖీం సంకల్ప సంకేతితాం
స్వాంకాంకాయిత వల్లకీం భగవతీం సారస్వతీం భావయే. 12

శ్రీంకారీం ముఖపంకజాత విజితైణాంకార్బుదాభాంకితాం
ఝంకారి భ్రమరాలకాం గతినిరాటంకాం లసత్కింకిణీం
హుంకారాకుల వైరిణీం విగత పంకాంకార్చితాం శంకరీం
ఓంకారాంకణవేదికాం భగవతీం సారస్వతీం భావయే. 13

క్లీంకారీం పరిణామ సంకుల జగత్సంకల్ప వైకల్పికాం
కంకాలీం సురసంకటార్తి హరిణీం పాశాంకుశౌ బిభ్రతీం
సాంకవ్యాంకిత గాత్ర శోభిత తనూవల్ల్యంక పల్యంకికాం
టంకాద్యాయుధ మండితాం భగవతీం సారస్వతీం భావయే. 14

సారిత్యంచిత బీజమూల నిలయాం తారళ్యసారళ్యదాం
ద్యారిత్యద్భుత కాంతిగోళ మహితాం వైరస్య నైరస్యకాం
వారూపాగమ వర్ణనీయ గమనాం సారూప్య వైరూప్యకాం
గీరిత్యద్భుత సర్వభావమధురాం సారస్వతీం భావయే. 15

చిల్లీలావిలసజ్జగత్త్రయపదాం సల్లాపనోల్లాసినీం
మల్లీహల్లకఫుల్ల సల్లలిత పుష్పోల్లాస కృల్లాలసాం
ఉల్లాఘస్థితికారిణీం భవఘటాకల్లోల కల్లోలినీం
వల్లక్యంచిత పాణిపల్లవయుగాం సారస్వతీం భావయే. 16

కాంతాం కాంతకథా నితాంతమధురా, మాద్యంత హీనాం చిరాం
సాంతత్యాతత దేహదాహనపరాఽఽచింతా కృతాంతాం, శుభాం
దాంతోద్దాంత తపోఽంతయోగ మహితాంతః కాంత సంతోషిణీం
శాంతాం శాంతభవాతపాం భగవతీం సారస్వతీం భావయే. 17

సర్వాం సర్వసుపర్వ గర్వ భిదురాం సర్వత్ర శోభాకరాం
సర్వానర్థ విదూర కార్యకరిణీం మౌర్వీ రవ స్వాదనీం
సర్వస్వార్పిత భక్త యోగకుశలాం స్వారస్య సర్వాత్మికాం
సర్వశ్రేష్ఠ పదాం పరాం భగవతీం సారస్వతీం భావయే. 18

నిత్యాం నిత్య పదోద్యతాం నిపుణతానిత్యప్రభావాద్భుతాం
అత్యర్థప్రియ వాదినీం చిరయశస్సంపాదనైకాదరాం
మత్యాంగీరసధీప్రసాద కరణాం నిత్యాన్నదానప్రియాం
సత్యశ్రీ పదదాయినీం భగవతీం సారస్వతీం భావయే. 19

పద్మాం పద్మనిభాంఘ్రి యుగ్మలలితాం పద్మాసనాలోలినీం
పద్మాఖ్యాననిధి ప్రదానకరుణాం పద్మాప్తకోటి ప్రభాం
పద్మాక్షీం నవపద్మరాగలసితాం పద్మాలయేష్టస్నుషాం
పద్మేం దీవర సామరస్య కలితాం సారస్వతీం భావయే. 20

వంద్యాం నింద్యవిరోధి[illegible]నకళా వంద్యాంఘ్రియుగ్మాంబుజాం
మాంద్యాంధిక్య జనౌఘమర్దనకళా జ్ఞాన ప్రభాతుందిలాం
నాంద్యగ్రేసర మోదినీం రసధునీ నంద్యాం మధుస్యందినీం
తాం ద్యావా పృథివీశ్వరీం భగవతీం సారస్వతీం భావయే. 21

దృశ్యాం దృశ్య సమస్త భౌవనవిభా మిథ్యా ప్రబోధాత్మికాం
దృశ్యా దృశ్య నిరూఢయోగమహితాం దృగ్దృశ్య లీలాదరాం
దృశ్యార్ధావ గతి ప్రసాదకరణాం సాదృశ్య వైశేషికాం
దృశ్యాం భోజ కళాధికాం భగవతీం సారస్వతీం భావయే. 22

ప్రౌఢాం ప్రౌఢ పరాక్రమాక్రమిత దైత్యాం దేవసేనాంగినీం
రూఢార్షేయ వచఃప్రసాదమధురాం రీఢావలీఢ ద్విషాం
గాఢాతంక నిదాఘ శీతపవనాం సోఢవ్యబాధప్రధాం
ఊఢా మంబుజజన్మనా భగవతీం సారస్వతీం భావయే. 23

ఇష్టివ్యష్టి సమష్టికా మతుల శిష్టాకృష్ట చారిత్రకాం
సృష్టి స్థిత్యవసాన కార్యచతురా మిష్టార్థ పుష్టిప్రదాం
కష్టాష్టార్త నికృష్ట పాలన పరాం స్పష్ట ప్రభావాద్భుతాం
ప్లుష్టవ్యాధి సుధాప్రసేచన కరీం సారస్వతీం భావయే. 24

ఈహా మీహిత మోహబాహుళక నిర్వాహార్తి నాశంకరీం
ఆహావాహుత సత్పదార్థమహిత వ్యాహృత్య మంత్రాత్మికాం
నీహారాబ్జమహామహీయు తనుశోభాహార్యమాహేశ్వరీం
వ్యాహారాహ్వ విహారిణీం భగవతీం సారస్వతీం భావయే. 25

స్పర్శాం స్పర్శిత సద్విమర్శన కళా సంస్పర్శి విజ్ఞానదాం
అర్ఘ్యైఘ్రాజ్య పయోమధూదక తల స్పర్శావగాధ ప్రియాం
దర్శిన్యద్భుత దర్శనాం విపుల దర్శాదర్శ సందర్శినీం
దర్శారాధ్య పదాంబుజాం భగవతీం సారస్వతీం భావయే. 26

హంసాం హంసవరాధిరూఢగమనాం హంసాక్షరోత్తంసినీం
హంసాంతాక్షర రూపిణీ మజరతాం హంసాంతరావాసినీం
హంసేందు ప్రతిభాసితాక్షియుగళాం హంసస్తుతాం హంసినీం
హం సత్త్వాం పరరూపిణీం భగవతీం సారస్వతీం భావయే. 27

యజ్ఞాం యజ్ఞమయీాం యజత్సుఫలదాం యజ్ఞేశ్వరీం యాజ్ఞికాం
యజ్ఞాపీం జపయజ్ఞ సుజ్ఞ మహితాం అజ్ఞాన సుజ్ఞానదాం
ప్రజ్ఞామూర్తి మధిజ్ఞ గర్వభిదురా మాజ్ఞప్త సర్వామరాం
జిజ్ఞాసుజ్ఞ కళావతీం భగవతీం సారస్వతీం భావయే. 28

అంబా మంబుజగర్భ నిర్భర దృశా సంబాధితాంగాంగినీం
కంబుగ్రీవ విలాసినీం శ్రుతి చతుస్సంబంధ వాగ్వాదినీం
బింబోష్ఠీం కవిలోకబింబిత గుణాలంబాం స్ఫురల్లంబుషాం
శాంబర్యంతక తైజసీం భగవతీం సారస్వతీం భావయే. 29

యోగాం యౌగిక యోగభోగగరిమోద్యోగ ప్రయోగాదరాం
యోగాయోగ నియోగినీం నతజనా యోగ్యత్వయోగ్య ప్రదాం
యోగిధ్యాత విరూప రూప మహితా మాయోగ యోగాతురాం
యోగిన్యంచిత వేదికాం భగవతీం సారస్వతీం భావయే. 30

బ్రాహ్మీం బ్రహ్మ పదార్థ సత్త్వమహితాం బ్రహ్మాంజలి స్వీకృతాం
బ్రహ్మారణ్య నిరంతరాయ వసతిం బ్రహ్మణ్య కార్యాతురాం
బ్రహ్మత్వార్థ సమస్త లోకజనతా జిహ్మ ప్రకారాంతకాం
బ్రహ్మగ్రంథి విభేదినీం భగవతీం సారస్వతీం భావయే. 31

కీర్తిం కీర్తిత లౌకికార్తిహరణాం కార్తాంతికారాధితాం
వార్తానర్తితధీవిశేష ఫలదాం స్మర్తవ్య సంవిత్ప్రదాం
స్ఫూర్తి శ్రీ పరిపుష్ట భావ వితతా మార్తావన వ్యాపృతాం
పూర్తాపూర్తి విధాయినీం భగవతీం సారస్వతీం భావయే. 32

బాలాం బాలిశపాలినీం సకల లీలాలోల లోకావనాం
బాలేందుద్యుతి పాదపల్లవయుతాం ఫాలాగ్ని చిహ్నాంచితాం
ఏలాలాలిత నీలకైశికవతీం నీలోత్పలాభాంబకాం
శూలాద్యాయుధధారిణీం భగవతీం సారస్వతీం భావయే. 33

సంసారార్ణవ తారణాభయకరాం హంసాసనే సంస్థితాం
శంసాపాత్ర మనీషి భక్తి సులభాం హంసాస్య నృత్యప్రియాం
సంసత్సర్వవశంకరాద్భుత వచస్సంసాధనామోదినీం
అంసోత్తంసిత భూషణాం భగవతీం సారస్వతీం భావయే. 34

సాహిత్యామృతపానలాలసపరాం సాహిత్య సాహిత్యకాం
మోహిత్వాంధతమిస్ర నాశనకరీం మేహాదిజాడ్యాంతకాం
మాహేయీ ఘృత సద్ధుతాఖిల హవిష్యాహ్లాద సౌహార్దికీం
ఊహాపోహవివేకదాం భగవతీం సారస్వతీం భావయే. 35

